# పీఠిక.

భక్తజనాగ్రగణ్యులారా!

ఈ శతకము భక్తిపారవశ్యమున వ్రాయఁబడినది. ప్రాచీనకాలంబునుండియు భక్తిని బెంపొందించుటలోఁ బ్రాశస్త్యంబుం బొందియున్నవి. ఈశతకకర్త తాను వ్రాసినరీతిగా ననన్యశరణ్యుఁడై శ్రీరంగనాయక పదారవిందముల గట్టిగఁ జిత్తంబున నుంచిన మహనీయుఁడు. తనస్థితిగతులనన్నింటిని భగవంతునకు నివేదించి కష్టజాలంబులనుండి కాపాడవలసినదిగాఁ గోరినాఁడు. ఆపన్నగశాయి యాపన్నుఁడగు నీకృతికర్త సన్నుతినాదరించి కల్గినవిపత్తులను బోఁగొట్టి కాపాడినాఁడు. భగవద్భక్తులకుఁ "ప్రార్థితార్థములు ఫలించుటలోఁ గొంతంతలుండవ," ను పెద్దలవాక్యము లీ కవిపుంగవునియెడ సార్థకములైనవి. కవిత్వము నాతికఠినమై సరళగతినలరారుచున్నయది. కవితకియ్యది మొదటిప్రయత్నము గాన నందందుఁ బాదపూరణ పదప్రయోగంబులు కనుపట్టినను మొత్తముమీఁద భక్తియుక్తంబగు నీశతకము చదువుటకు హృద్యముగను, భక్తిసంజనకంబుగను నున్నదనుటలో నతిశయోక్తిలేదు. ఈ కృతికర్త యిట్లే భక్త్యుద్బోధకంబులగు శతకములను రచించి భగవత్కృపాపాత్రుఁడై చిరాయురారోగ్య భాగ్యంబులతోఁ దులఁదూఁగుఁ గాక యని పరమేశ్వరుఁడగు శ్రీరంగనాథునిఁ బ్రార్థించువాఁడ. ఇక్కవికి ఆలూరికోన శ్రీరంగనాథుఁ డిష్టార్థ ప్రదాయకుఁడై నిరంతర కుశలసంధాతయగుం గాక!

కడప
5—5—34

పండిత పాదసేవకుఁడు,
విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.
కావ్యపురాణతీర్థ.

# విన్నపము.

ఆస్తికమహాశయులారా!

నాకుఁగవితాశక్తిలేదు. విద్యావంతుఁడఁగాను. వ్యాకరణాదు లెఱుంగ. ఆధివ్యాధులచే మునింగి గొప్పగొప్ప పట్టణములు తిరిగి యందందుఁగల వైద్యశిఖామణులచే నసాధ్యవితీరవని యెఱింగితి. ఘటికాసిద్ధిదుఁడగు శ్రీఘటికాచలేశ్వరుఁడేనా యాధివ్యాధుల నడంచువాఁడని మదిందలంచి గట్టినమ్మకముతో నాశ్రయించితి. తదేక దీక్షతో నాక్షేత్రమునఁగూర్చుండి నాయభ్యర్థనమును దెలుపుచు సేవించుచున్న నాకుఁబద్యరూపములుగ స్తోత్రింపఁగోర్కి పొడమె. తద్వాంఛానుసరణముగఁ జంపకోత్పలములచే శ్రీరంగనాయకా! యను మకుటముతో నీయష్టోత్తర శతకమును రచించితి. సర్వ నామములచే విలసిల్లున దేవుఁడు నాయెడఁ బ్రీతుండై నాకుగల యాధివ్యాధులనడంచి స్వస్థుంగావించె. స్వగ్రామంబుచేరితి. సుఖముగ జీవయాత్రసాగించుచు నొక్కమారీశతకము ముద్రించుట మేలని తలంచితి. నాభాగినేయుఁడు కడప మునిసిపల్ హైస్కూలు నందుఁ బండితుఁడుగనున్న కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు మాయింటికిరాఁగా నీయభిప్రాయం బుఁదెలిపి గ్రంథముం జూపితి. మంచిదని యాతఁడు శతకమునంగల దోసఁగులను దిద్ది యొసంగె. అచ్చొత్తింపఁబ్రోత్సహించె. నాకీరీతి సాయముఁజేసిన భాగినేయుని దీవించితిని. గ్రంథము నింతకాలము నకు లోకమునఁ బ్రకటింపఁగల్గితిఁగదా యని సంతసించితి. భక్తుఁడు

కోరిన కోర్కెల భగవంతుఁడే తప్పక తీర్చువాఁడని యెఱుకపఱచు నీగ్రంథమును సావధానులై పఠించుటయే నాయుద్దేశ్యము. శ్రీరంగనాథుఁడు భక్తులపాలిటి పెన్నిధానము నాకుసాయపడిన వారినిబఠించు భక్తులకును వాంఛితార్థముల నెఱవేర్చుఁగాకయని ప్రార్థించుచున్నాఁడ.

తాడిపత్రి }
22—7—34 }

భక్తజనవిధేయుడు,
యం. చిదంబరయ్య.



శ్రీ ర స్తు.

# శ్రీ ఆలూరుకోన రంగనాయక శతకము.



1. శ్రీరఘువంశ వార్ధికుల ♦ శేఖర! మన్మథకోటి సుందరా।
కార! ధరాత్మజాహృదయ ♦ కామితపూర! మునీంద్రమానసా।
ధార! ధరాధరా! దనుజ ♦ ధైర్యహరా! జగదేకవీర! నా
కోరికదీర్చు మొక్కటియు ♦ కూరిమితోడుత రంగనాయకా॥

2. కోరవసుంధరాస్థలిని ♦ గోర్కులు పెక్కులు నిత్యముఁ మహా।
ఘోరదురంతపాతకము ♦ క్రూరముదాఁటగరాని భూరి సం।
సారమహాబ్ధిగట్టుఁగన ♦ సారెకు మ్రొక్కెద శ్రీనివాస! నా।
కోరికలిచ్చి నిత్యమును ♦ గూరిమిఁబ్రోవవె రంగనాయకా॥

3. మాధవ! నీపదాబ్జములు ♦ మానక మానసమందునిల్పి యే।
బాధలు బొందకుండనిను ♦ బ్రస్తుతిఁజేసెడిభాగ్యమిమ్ము స।
ద్బోధయొసంగి నిత్యమును ♦ భుక్తియు ముక్తియు నిచ్చునట్టి స।
త్సాధులపాదసేవ సత ♦ తంబు నొసంగవె రంగనాయకా॥

4. మానసవీధి నిత్యముఁను ♦ మాధవ నీనుతిభక్తి చేయుఁగాఁ
గానసెట్టులోచనును ♦ గానని మేషము నిల్వఁబోదునా
మానసమక్కటా! యెటుల ♦ మన్ననఁజేయుదొ దీనపాల! శ్రీ
మానసనిత్యవాస! యను ♦ మానము సేయక రంగనాయకా॥

5. ఎంతని వేఁడుకొందునిను ♦ నెంతని ప్రార్థన జేయువాఁడనో।
వంతలఁబొందఁజాలనిను ♦ వర్ణనఁజేయగ వేదశాస్త్రముల్।
చింతన సేయ నేగతిని ♦ సేవలు చేయఁదరింతు నెట్టు ర
వ్వాంతె యెఱుంగఁజేయుమిఁక ♦ నైనదయామయ! రంగనాయకా॥
6. తల్లియుఁదండ్రియున్ శిశువుఁ ♦ దప్పొసరించిన మంచిదారికిన్।
మెల్లఁగఁజేర్పఁజూతురిల ♦ మీవలెఁ గ్రూరము పూనియుందురా।
కల్లలుగావు లోకములఁ ♦ గానఁగ దైవము లేఁడు దీనులన్।
దెల్లమటంచుఁ జాటెదను ♦ దీవ్రముతో నిఁక రంగనాయకా॥
7. రామయటన్న మాత్రమున ♦ రక్షయొనర్చు సమస్తపాపముల్।
భూమినశించు సౌఖ్యములఁ ♦ బొందునరుండని చాటుపెద్దలన్।
ఏమనియందురో జనుల ♦ దేగతిఁజూతురొ రామరామ! శ్రీ
రామ! యటంచు నేఁబిలువ ♦ రక్షితుఁజేయవు రంగనాయకా॥
8. ప్రాణమునొచ్చె రోగమున ♦ బాధలు హెచ్చెధనంబువిచ్చెనా।
త్రాణయుఁజచ్చె కర్మములు ♦ తప్పక దార్కొనివచ్చెనిచ్చలున్।
బ్రాణసమాన మిత్రజన ♦ పాళిహసింపఁగఁజొచ్చె నిత్యక।
ల్యాణగుణాభిరామ! కొని ♦ యాడెదఁగావవె రంగనాయకా॥
9. సందియమేల పాపములఁ ♦ జాలఁగడించితి దీనపాల! గో।
వింద! భరింపఁజాలనను ♦ వంచనచేయకు భక్తలోల! ము।
న్నుందె తలంపకేల కడు ♦ మూర్ఖతఁబూనితి బేలవందువో।
కందురె కష్టజాలముల ♦ గాసిలినొవ్వక రంగనాయకా॥

10. సత్యమెఱుంగలేక నిను ♦ సన్నుతిఁజేయక కామసౌఖ్యముల్।
నిత్యమటంచు వీఁకఁబర ♦ నిందలఁజేయుచు లోకమెల్ల దు।
ష్కృత్యుఁడటన్నఁబోక కడుఁ ♦ ఘోరముమానక పొట్టకై ప్రవ్వచే।
మృత్యుసమాన కష్టముల ♦ మెట్టితిఁ బ్రోవవె రంగనాయకా॥

11. ఆసలఁజిక్కి సౌఖ్యముల ♦ నందలమెక్కి సమస్తసంపదల్।
భాసిలఁజొక్కి కల్మిఁబర ♦ బాధలెఱుంగక నిక్కి పాపముల్।
చేసినవాఁడుళక్కి మృతిఁ ♦ జెందిన నిన్ భజియింమఫక్కి నీ।
దాసుఁడ మ్రొక్కి వేఁడెదను ♦ దైవమ బ్రోవవె రంగనాయకా॥

12. నీకథలన్నవిన్న నిను ♦ నిత్యము ధ్యానము సేయుచున్న వా।
రేకులమందునున్న ఘను ♦ లెన్నదినంబును వారిఁగన్నఁ జీ।
కాకగుఁబాపమున్న భవ♦కారణముల్ హరియింపుమన్న యీ।
లోకమసత్యమెన్న మతి ♦ లోలతనింపక రంగనాయకా॥

13. మున్నుబురాణగాథలను ♦ మోదముతోఁ ధృత నావిభీషణున్।
సన్నుతపూతయౌ శబరి♦శాశ్వతభక్తుగుహున్ మహామహున్।
మన్ననఁగాచినాఁడవను ♦ మాటలువింటిని సత్యమైన నే।
నిన్నుఁదలంచి మ్రొక్కితిని ♦ నేర్పునఁబ్రోవవె రంగనాయకా॥

14. మానక చేతునీభజన ♦ మానసమందున నిష్ఠగాన నీ।
యాన బిరాన మాన కమ♦లాసనవంద్య! సుతాదివాంఛకున్।
లోనయితిన్ బిరాన నొక ♦ లోపములేదన మూర్ఖచిత్తుడన్।
దానవవైరి! యేగతిని ♦ ధన్యునిఁజేయుదో రంగనాయకా॥

15. అందఱునన్నిరీతులను ♦ నాడుచునుందురు మోక్షమార్గముల్।
పొందఁగఁగ్రోవలంచుఁబలు ♦ పొందికఁజేసియుఁదెల్పుచుందురా।
సందులకీలెఱుంగనిను ♦ సన్నుతిఁజేసెద వేఱుచింతలిం।
కెందుకు నీదెభారమని ♦ యీశ! పరాత్పర! రంగనాయకా॥

16. కోపముఁబాపి శాంతమును ♦ గూరిమితోడుతనిల్పిపాపముల్।
శ్రీపతీ! గూప్రమాపి బుధ ♦ సేవలుచేయఁగ రేఁపి నిత్యమున్।
నీపయి మానసంబెప్పుడు ♦ నిల్పిభవాబ్ధినిఁగూప్రమాపి నా।
యాపదలన్ హరింపుమిఁక ♦ నన్యునిఁజేయక రంగనాయకా॥

17. సేవకులైనవారు పనిఁ ♦ జేసిన వేతన మిత్తురీయిలన్।
దేవుఁడవీవుసేవకుఁడ ♦ దీనుఁడనేగతిలేని వాఁడనన్।
బ్రోవఁగరాదె నీకుదయ ♦ ఫుట్టదె కష్టముచేయలేదె నా।
కీవలదేయథార్థముగ ♦ నీప్సితముల్వర రంగనాయకా॥

18. ఎండయు వానమంచనక ♦ యెర్పడనీకుఁ బ్రదక్షిణంబులున్।
గొండలుఁగోనలెక్కుటయుఁ ♦ గూడసి చల్లనినీట మున్గుటల్।
బండలఁబవ్వళించుటయుఁ ♦ బస్తులొనర్చుట వెల్లఁగాననే।
కుండలిశాయి! వేతనము ♦ కొమ్మనవేటికి రంగనాయకా॥

19. చేతనుగాసులేదిఁకెటు ♦ చేయుదుతిండికి రామరామ! నా।
వేతనమిచ్చి బ్రోతువన్ని ♦ వేమఱుసేవలు చేయఁబల్కవే।
యాతురబుద్ధినైతినిను ♦ నక్కటనమ్మితిఁబెక్కుకష్టముల్।
నాతలకెక్కెనోర్వమటి ♦ న్యాయముదప్పకు రంగనాయకా॥

20. ఊరకపోవునంచుశిల ♦ యోపికఁబల్కక జాగుచేసినన్।
క్రూరుఁడరచ్చకీడ్తునను ♦ గొట్టిననోర్తుఁదెగించినాఁడనన్।
దూరుచుఁవద్దువద్ద నిన ♦ దుష్టతనంబొసరింతుఁ బ్రాణసం।
వారము నీసమీపమునఁ ♦ బాసెదబల్మిని రంగనాయకా॥

21. మానముపోవుజీవనము ♦ మంచిదిగాదు బిరానఁబ్రాణమే।
మానసుఖంబుగల్గునను ♦ మానములేదు నిజంబుమానికిన్।
హీనమెయాత్మహత్యయని ♦ యెంచిన మీపదపారిజాతముల్
ధ్యానముఁజేసిచచ్చుటయె ♦ దివ్యమునాకిఁక రంగనాయకా॥

22. ఏఁచఁగనేల నాకుగతి ♦ యేయనినమ్మితి నిన్ను నీగతిన్।
నీచతఁబొందఁగావలసె ♦ నిక్కముగా నినునమ్మకున్నచోఁ।
జూచినవారలెల్లనను ♦ జుల్కఁగఁజేయరు కష్టజాలముల్।
ద్రోచిసమస్తసౌఖ్యములఁ ♦ దృప్తివహింపనె రంగనాయకా।

23. కాంచనచేల! మాటలకుఁ ♦ గంపమునొందు శరీరమక్కటా।
వంచనమాని నిత్యమును ♦ వారికి వారికి సేవఁజేయుచున్।
మంచియుఁజెడ్డమాటలకు ♦ మానసమందునఁ గుందికుందినా।
సంచితమంచునేడ్చెదను ♦ జావోనఁగూర్పవె రంగనాయకా॥

24. ఎక్కువతక్కువ ల్వెదుక ♦ నేమగునోయని నాఁడుగుండియల్
అక్కటకొట్టుచుండునిజ ♦ మార్తివహించును మానసంబిఁకే।
దిక్కునుదోఁచదేగతిని ♦ దీర్తుఋణంబును శ్రీనివాస! నే।
మ్రొక్కెదఁజూపవే తెరువు ♦ మోహనరూపక! రంగనాయకా।

25. కొల్చినవారినేకొలచి ♦ కోపముదాఁచి భయంబుదోఁచినన్।
బిల్చినవారిసన్నిధికి ♦ భృత్యునిపోలికమాట లోపలన్।
నిల్చి యదల్చినన్ బలుక ♦ నేరకమోమును దాఁచిదాఁచి ఛీ।
పల్చనయయ్యె నాఁబ్రతుకు ♦ ప్రాణముపోవక రంగనాయకా॥

26. దేశములన్ జరించిబలు ♦ దీనతయాచన లాచరించియో।
కేశవ! పాపుకొందమనఁ ♦ గేవలరుగ్మతవీడిపోదుపో।
చేసెదవంచునెంచినుతి ♦ చేసిననామొఱనాలకింపవే।
దాసుఁడ నామనోవ్యధలు ♦ తప్పకఁదీర్పవె రంగనాయకా॥

27. కష్టములెన్నియున్నఁగడ ♦ గండ్లనుబొందవచ్చుఁగాని ఛీ।
సృష్టినినప్పుఁజేసిమనఁ ♦ జెల్లదునీదగుపాదమాన నా।
కష్టముఁదీర్పవేఁడెదను ♦ గావఁగదే ఋణబాధఁదీర్చి నీ।
కిష్టుఁడఁగానొయాదుఁ గొఱ ♦ వెందునులేదిఁకరంగనాయకా॥

28. పాడయిపోయెబుద్ధియొక ♦ జాటనునిల్వదుకూర్చొరాదిఁకే।
జాడఁగుదుర్పనోనో దను ♦ జాంతక! ద్రవ్యముగల్గుటెట్టులో।
వేడుకతోడ "శ్రీరమణ! ♦ వెంకటనాయక"యంచు నెమ్మదిన్।
వీడకసంస్మరించుచును ♦ వేసుఖనొందునె రంగనాయకా॥

29. అంతటిభాగ్యమబ్బునెయ ♦ హా! తలపోయఁగఁబాపకర్ముఁడన్।
సుంతయుభక్తిలేదునిను ♦ జూచుటదివ్యులకౌనుఁగాక నా।
సంతయులోపముల్ దలఁప ♦ నౌనెటునీదెసనేరికైనఁద।
త్స్వాంతములోవనమ్మకము ♦ దార్కొనకున్ననురంగనాయకా॥

30. కన్నులుమూసిచూకసముఁ ♦గాంచుచులోవెలుఁగొందుదివ్యమా।
పున్నమనాఁటిరేవెలుగుఁ ♦ బోలుముఖంబువిశాలవక్షముఁ॥।
వన్నెలుగుల్కుచిత్కళలు ♦ వర్ణనసేయఁగ శంకచక్రముల్।
పన్నుగనీస్వరూపమును ♦ బల్మఱుగాంతును రంగనాయకా॥

31. పాపలచూపులోపలను ♦ బల్మఱునీదగు దివ్యరూపముఁ॥।
శ్రీపతినిల్పి సంతసముఁ ♦ జెందుదునంచు ముదంబుదోఁచిన॥।
బాపపుబుద్ధినిల్వదోక ♦ బాటనఁద్రిప్పుమటొందు త్రోవకు॥।
గోపముఁజేసిన॥ శిరముఁ ♦ గొట్టినసేమన రంగనాయకా॥

32. సంగముమానియొంటిగను ♦ స్వామిభవద్వపుయొకవాంఛతో।
మంగళవిగ్రహోయెటుల ♦ మన్ననఁజేయుదో పాపకర్ముఁడ॥।
వెంగలినంచు వేఁడుతఱి ♦ విస్మయమందఁగ మానసంబులో।
దొంగతనంబుతోడనొక ♦ ధోరణినిల్వదు రంగనాయకా॥

33. చప్పుడుగాని లోపలను ♦ సన్నతలంపులుగాని దాహముఁ॥।
చెప్పఁగరాని యాఁకలియుఁ ♦ జిన్నిపిల్లలు భార్యయంచునే।
చొప్పననైనమానసము ♦ స్రుక్కుచునుండును నేమిచెప్పుమా।
యప్ప! కృపాబ్ధివైమనసు ♦ నారయనిల్పవె రంగనాయకా॥

34. ఏమనుకొందురోజనుల ♦ దేగతిఁగందురో బంధుజాల మి।
ట్లేమహానీయదర్శనమిఁ ♦ కే ఫలమిచ్చునో యెట్లువేఁడిన॥।
స్వామిసుఖంబుగల్గునోవి ♦ చారమదెయ్యది ప్రీతినిచ్చునో।
యీమహిదిక్కుఁదోఁచకయ ♦ యేనుదలంకెద రంగనాయకా॥

35. కొండలలోవసించినిను ♦ గూర్చిభజించుచుఁబొందిఁబ్రాణముల్।
ఉండెడునంతకాలమును ♦ నొక్కటిఁగోరక గట్టిపట్టుగా।
నండజవాహనా! పలుకు ♦ మంచువిరాగముఁబూని క్రుద్ధతన్।
జండితనంపుబుద్ధిగొని ♦ చిందులఁద్రొక్కుదు రంగనాయకా॥
36. నిశ్చయబుద్ధిలేకమతి ♦ నేర్చినయట్టుల దిక్కుదోఁపకే।
పశ్చిమబుద్ధినై యొకటి ♦ బాగుగఁజేయఁగలేక సద్బుధుల్।
నిశ్చయమిట్టిదన్నయది ♦ నిక్కముగాదనికాని వాక్యముల్।
దుశ్చరితుండనైపలికి ♦ తొందఱపెట్టితి రంగనాయకా॥
37. సంశయనాశనావళికి ♦ సర్వమువ్యర్థమదేర్చికైన ని।
స్సంశయవృత్తిక్షేమమగు ♦ సర్వశరణ్యము నమ్మకమ్మునే।
యంశములందుసత్యమని ♦ యెనుదలంతును శ్రీనివాస! నా।
సంశయముల్ తొలంగునటు ♦ చక్కఁగదిద్దవె రంగనాయకా॥
38. పిచ్చిసమస్తకర్మములు ♦ పిప్పినిజేయుతఱిన్ బుతంబునన్।
సచ్చరితంబువ్యర్థమగు ♦ స్వామియిఁకేటికి నేమిచేసినన్।
బొచ్చెములేనిభక్తినిను ♦ బూజలుచేయఁగ శక్తినీవె నా।
యిచ్చసమస్తకార్యముల ♦ కీశ్వర! నీదయ రంగనాయకా॥
39. ఊరకలేనిపోనిబహు ♦ యుక్తులలాభములేదులేదు నే।
నేరకచేసికర్మముల ♦ నీగతికష్టములందుచుందునో।
నీరజనాభ! నీవెగతి ♦ నిక్కమునమ్మితివేఱు చింతలన్।
జేరఁగనీకకావుమిఁకఁ ♦ జిన్మయరూపక రంగనాయకా॥

40 చేయరేయప్పుకష్టములఁ ♦ జిక్కిరేభూస్థలిరోగవృద్ధిచే।
వేయువిధంబులన్ వ్యథలు ♦ వేసటిలున్ స్వకళత్రపుత్రులున్।
రోయఁగఁగన్నకష్టములు ♦ రోతలఁబొందరె పాపకర్ములై।
వాయువుబొందిదాఁటినను ♦ వంతలు లేవిఁక రంగనాయకా॥

41. కావుననీదాబ్జములె ♦ గట్టిగఁబట్టి హృదంతరంబునన్।
సేవలుచేయువాఁడనోగీఁ ♦ జింతలలాభము లేదు జానకీ।
దేవియొసంగుసద్ధనము ♦ దేవుఁడు రాముఁడు రక్షయంచు నా।
భావమునన్ దలంతునిఁకఁ ♦ బాపవిదూరక! రంగనాయకా॥

42. దయ్యమటంచు రోగమని ♦ తప్పక లోనినరంబుదప్పెనం।
చొయ్యనఁబూర్వజన్మకృత ♦ ముండినవాసము కానిదంచు నో।
యయ్యా! పచింతుపెట్టుమయి ♦ నట్టు భూస్థలి శాబరంబునా।
నెయ్యదిసత్యమోయెఱుఁగ ♦ నేరికిశక్యము రంగనాయకా॥

43. తీర్థములందుమున్నితిని ♦ దివ్యములైన సరోవరంబులన్।
సార్థకమైనక్షేత్రముల ♦ సన్నిధిసేవలుచేసి నిల్చితిన్।
బార్థరథాగ్రవాసునుతి ♦ బాగుగఁజేసితి భూతభీతిచే।
వ్యర్థములయ్యెసర్వమును ♦ విప్రవినోదము రంగనాయకా॥

44. ఓఘటికాద్రివాసయిఁక ♦ నోర్వఁగఁజాలనటంచు వేఁడినన్।
నీఘనకర్మదీర్పఁగను నేఱను ♦ సంతతిగొమ్మటంచునీ।
వాఘనసంపదాళులిడ ♦ నబ్బురమొందఁగ నీలనీరదా।
మోఘశరీర! శ్రీరమణ! ♦ యోగిజనాశ్రయ! రంగనాయకా॥

45. ఒక్కటిగోరఁగానిడుట ♦ యొక్కటిదైవమనీదు చిత్రముల్।
నిక్కముగానెఱుంగధర ♦ నేరునుజాలరు బ్రహ్మరుద్రులుఁ।
దిక్కిదియంచుమూలమును ♦ దెల్వినినిల్పఁగఁజాలరన్న నే।
నెక్కడనీదుమాయయది ♦ యొక్కడ శ్రీధర రంగనాయకా॥

46. కన్నులనశ్రుజాలములు ♦ గారఁగరామ! యటంచునెమ్మదిఁ।
సన్నుతిఁజేయుకాలమునఁ♦జక్కగదేహముమీఁదిభ్రాంతియుఁ।
బన్నగఁబుత్రమిత్రులను ♦ భావముదోఁపఁగనీకనాహృదిఁ।
బన్నగశాయి నిల్పినను ♦ బాలనచేయనె రంగనాయకా॥

47. ఏపనిఁజేయుచున్న మన ♦ సెన్నివిధంబులఁదప్పఁద్రోవలఁ।
ఊపిడిఁబొందుచున్న హరి!♦రామ యటంచును బల్కువాకునఁ।
శ్రీపతినిల్పియుండునటు ♦ చేయవె ధన్యుడనౌదు నంతియే।
పాపమొపుణ్యమోయెటులు♦పాలనఁజేయుదొ రంగనాయకా॥

48. పామరులఁ గృపాబ్ధివయి ♦ పాలనజేయుదు వేమిపాపమో।
వేమఱునన్నుఁబ్రోవుమని ♦ వేయువిధంబులఁగొల్వఁబల్కవే।
సామజరాజరక్షకుఁడ! ♦ సర్వవిధంబుల నీవెదిక్కునీ।
తామసమేలదాయనె ప్ర ♦ తాపముఁజూపఁగ రంగనాయకా॥

49. నీదయగల్గనఁ ధనము ♦ నిర్మలతేజము జ్ఞానసంపదల్।
శ్రీదయితా! లభించు ము ♦ నిసేవిత! యెంతటి పాపికైననుఁ।
వాదములేలనాపయిని ♦ వంచనచేయక రమ్మునెమ్మనీ।
పాదములాశ్రయించితిని ♦ బండితపాలక! రంగనాయకా॥

50. నీదయలేక పార్థివుఁడు ♦ నిర్ధనుఁడౌరణరంగ వీరుఁడున్।
సాదగుమంత్రతంత్రములు ♦ సాగవదెట్టి వివేకశాలియున్।
గాడనిపించునొక్కటియుఁ ♦ గల్గదుధారణిజంతుజాలముల్।
శ్రీదయితా! భవన్మహిమ ♦ చెన్నలరారును రంగనాయకా॥

51. అర్భకుఁడల్లిగోపమున ♦ నానలఁబొమ్మని కొట్టితిట్టినన్।
నిర్భయవృత్తిత్వచ్చరణ ♦ నీరజముల్ బిగబట్టిగట్టిగా।
దుర్భరమైనయాఁకటిని ♦ దుఃఖముబొందుచుఁబాలఁద్రావఁడే।
గర్భజనిత్వప్రేమయటు ♦ గావునఁగావవె రంగనాయకా॥

52 శ్రీరఘురామ! సర్వసుర ♦ సేవితనామ! సురారిభీమ! దు।
ర్వారపరాక్రమక్రమ! సు ♦ వర్ణసుపర్ణవిహార! రామ! నా।
కోరికలిచ్చురామ! రవి ♦ కోటిసమప్రభ! దివ్యధామ! శ్రీ।
ధీరహిఁగూర్చిబ్రోవుమిఁక ♦ ధీర! పరాత్పర! రంగనాయకా॥

53. ధ్యానముఁజేయునీమము వి♦ధేయతసత్యము శాంతభావముల్।
మానసమందునిశ్చలము ♦ మాధవ! నీపదకంజసేవలున్।
దీనదయాపరా! దినము ♦ దివ్యములౌభవదీయకీర్తనల్।
దానవమర్దనా! యొసఁగి ♦ ధన్యునిజేయవె రంగనాయకా॥

54. అచ్చపుభక్తిలేకనిను ♦ నర్చనఁజేసినమేలుగల్గునా।
సచ్చరితుల్ పొనర్చుక్రియ ♦ సన్నుతికెక్కునెయన్నఁదిన్నగా।
నిచ్చెనమెట్టులెక్కునట్టు ♦ నిత్యమునిన్ దలపోయుచుండఁగా।
బొచ్చెములేనిభక్తుఁడయి ♦ పొందునునీదయ రంగనాయకా॥

55. నీదగుద్వారపాలకులు ♦ నేర్పునరక్షమైన ర్తు రెప్పుడుఁ గా।
నీదగుశయ్య శేషుఁడతి ♦ నిర్దయుఁడక్కడఁ జేరనీఁడు వే।
నీదగువాహనంబరుగు ♦ నింగికివాసముఃక్షీరవార్ధియా।
నీదగుదర్శనం బెటుల ♦ నేరికిసాధ్యము రంగనాయకా॥
56. రాదుగ దాకృపారసము ♦ రాఘవరామ! మనోజసుందరా!।
పోదుగ దాపురాకృతము ♦ పుణ్యముచేయనివారి కేవిధిన్।
లేదుగ దాసుఖామృతము ♦ లేశమునీస్తుతి లేనివారికిన్।
గాదుగ దానను న్విడుచఁ ♦ గామితదాయక! రంగనాయకా॥
కర్తవునీవులోకములఁ ♦ గావఁగఁద్రుంపఁగ సర్వశక్తులున్।
57. యుక్తులునీమహత్త్వములు ♦నూహలయందునఁజిక్కదుర్మతుల్।
భర్తనునేవటంచుభవ ♦ బంధములన్ బడిదారిగానకే।
ముక్తికిదూరులై చెడరె ♦ మోహనరూపక! రంగనాయకా॥
నాసరిదీనమానవుఁడు ♦ నాస్తిధరిత్రిని దేవతాళిలో।
58. నీసరి దేవ దేవుఁడును ♦ నిక్కము లేఁడు మహానుభావ! నీ।
దాసుఁడనంటి పాదములు ♦ తప్పక నాశిరమందుఁదాల్చితిన్।
వాసుకిశాయి! కావుమిఁక ♦ వంచనచేయక రంగనాయకా॥
59. పట్టెనుమూర్ఖచిత్తుఁడిది ♦ భావ్యముగాదని దూరభావమున్।
బెట్టకయేమిచేసినను ♦ భేదము లెంచక పాపజాలమున్।
గొట్టిభవద్దయామహిమ ♦ గోర్కెబవిత్రతఁగల్గఁజేయవే।
పట్టినిపట్టుఁ బెట్టుదురె ♦ భావమునొవ్వదె రంగనాయకా॥

60. ఏమియొసంగినారో పర ♦ మేశ్వర నీప్రియభక్తులౌటకున్।
స్వామియెఱుంగ నిశ్చయము ♦ సజ్జనరంజన! యెంతవేఁడినన్।
మోమొకసారి చూపవు ప్ర♦మోదమునొందితినంచుఁబల్కవే।
రామ! బిరానఁదెల్పుమిఁక ♦ రాజసముంపక రంగనాయకా॥

61. దానములిచ్చి గోధనము ♦ దండుగఁబోసిరో యప్పులిచ్చిరో।
మానకభూషణాంబర వి ♦ మానమహాత్తతి గొల్లఁబెట్టిరో।
మానులు కొండకోనలను ♦ మాటలచేతను బేలుపుచ్చిరో।
దీననిధాన! వారిడిన ♦ తృప్తియదెట్టిది రంగనాయకా॥

62. మంత్రములన్నఁబూజలన♦మారణహోమములన్న యోగముల్।
తంత్రములన్న వేదజప ♦ తర్పణాలన్న మహాభిషేకముల్।
యంత్రములన్న సంధ్యలన♦యజ్ఞముయాగములన్న సర్వమున్।
జంత్రపుబొమ్మ నాట్యమగు ♦ సర్వమునీదయ రంగనాయకా॥

63. మాయలఁజిక్కి బ్రహ్మయును♦మారహరుండును దేవతాళియున్।
దోయరుహాసనాయెఱుక ♦ దోఁచక నీమహనీయతత్వమున్।
వేయువిధంబులన్ మదిని ♦ వేడ్కఁదలంతురు సర్వభారముల్।
నీయ్యవిగాఁదలంచియతి ♦ నిర్మలభక్తిని రంగనాయకా॥

64. ఒక్కటిచేయఁజాల నిజ ♦ మొక్కటిపల్కఁగఁజాలమేల నా।
టక్కరిబుద్ధికోరికలఁ ♦ దాండవమాడుచునుండు మెండుగా।
నక్కటనీదుచిత్రమిది ♦ యంతయునేఁదలపోసి హాయిగా।
నొక్కటినాదిలేదనుచు ♦ నుండెద శ్రీకర! రంగనాయకా॥

65. ఓరఘురామ! నేరముల ♦ నూరకనాపయిమోప ధర్మమా।
సారెకునీవెనాకుగతి ♦ సత్యముపల్కితి నమ్మికొల్చితిన్।
భారమునీపయిన్ నిలిపి ♦ భద్రముగా భజియింతునంతయే।
శ్రీరఘురామరామ, యను ♦ చింతననిల్పవె రంగనాయకా॥

66. ఏగతిఁజూచెదో దురిత ♦ మెట్టులఁబాపెదో సార్వకాల్వములన్।
ఏగతిఁగాచెదో వినుతి ♦ యెట్టులఁజేసిన సమ్మతింతువో।
ఏగతిలేనివాఁడనయి ♦ యేనిటుచిక్కితి నీకుమ్రొక్కితిన్।
ఏగతిసేయసమ్మతమె ♦ యీశ! పరాత్పర! రంగనాయకా॥

67. ఎక్కువతక్కువల్గలవె ♦ యెందును దేవ! విరోధితమ్మునిన్।
మక్కువఁగావవేశబరి ♦ మంచిఫలంబులనియ్య మెక్కవే।
రక్కసి 'కావుకావు' మన ♦ రక్షణఁజేయవె కాకదైత్యునిన్।
దిక్కనినమ్మి వేఁడెదను ♦ దీనునిబ్రోవవె రంగనాయకా॥

68. మానవజన్మమెత్తిమది ♦ మాధవ! నిత్యమునీదు చింతనల్।
మానకయున్న మానవుఁడె ♦ మానవుఁడాతఁడె పుణ్యమూర్తి శ్రీ।
మానసలోల! మర్త్యుఁడయి ♦ మజ్జనభోజన దివ్యసౌఖ్యముల్।
పూనిపరేచ్ఛలేనినరుఁ ♦ బూజ్యులుమెత్తురె రంగనాయకా॥

69. నేరములెల్లనావనుచు ♦ నిందలపాలొనరింప ధర్మమా।
సారసనాభ! నీకరుణ ♦ చాలఁగనాపయినున్న నేరముల్।
నారకజాలముల్ దొలగు ♦ నమ్మినవానిని రిత్తపుత్తురే।
కారుణికో తమా! కరుణఁ ♦ గావవెనన్నిఁక రంగనాయకా॥

70. వేషములున్ యథోచితమొ ♦ వేఁడనుమిక్కుటమెన్నఁడేనియున్।
భాషలలాభ మేమనుచుఁ ♦ బల్కుటలతియ్యన లోనఁగుత్సితం।
బీషణము ల్త్యజించినటు ♦ లింగితమెంతయు తెల్పునీచులన్।
దూషణచేయకుండుదురె ♦ దుర్మదనాశక! రంగనాయకా॥

71. తానొనరించుయత్నములు ♦ దైవసహాయముకూడివచ్చినన్।
మానుగసత్ఫలం బొసఁగు ♦ మానవులందుకు దేవదేవునిన్।
ధ్యానముఁజేసి పూనవలె ♦ ధైర్యముతో సకలంబుఁజేసితిన్।
నేననిపల్కువారలతి ♦ నీచులు శ్రీకర! రంగనాయకా॥

72. జాతియునీతియెంచకయె ♦ శాస్త్రములంచుఁ దలంపకిచ్ఛలో।
నీతియునిర్మలత్వమును ♦ నిల్కడయేమియులేక మందులా।
పాతకులైన నీస్మరణ ♦ పల్కుచుఁజేసినవారిఁ బ్రేమతో।
నేతటినైన వత్సలత ♦ నెంతువుకావఁగ రంగనాయకా॥

73. మానవకోటిలోఁ గొఱత ♦ మాత్రములేని నరుండుగల్గునే।
మానుగనెన్ని లోపములు ♦ మర్త్యునికున్నను జింతలేదిఁకే।
మానవుఁడైననిన్ మఱచి ♦ మానసమందు భజింపకుండునా।
మానవజన్మమే కొఱఁత ♦ మాధవ! శ్రీధర! రంగనాయకా॥

74. బొట్టులుబెట్టినన్ నుదుట ♦ బూడిదఁబూసిననామధారులై।
కట్టుకునిల్చినన్ మనసు ♦ గట్టకపెట్టక ముక్తిలేదదే।
పట్టుననైన సద్బుధుల ♦ పజ్జనుజేరివసింపకుండినన్।
వట్టికువేషజాలముల ♦ వచ్చునెమోక్షము రంగనాయకా॥

75. కొట్టుమునాశిరంబు తెగ ♦ గొట్టుము దేహము నాలుఖిల్లలన్।
బట్టుము పొట్టకూటికిని ♦ బట్టకుఁ బెట్టక యెట్టులైననే।
పట్టినపట్టుఁ బీడఁజల ♦ పట్టితినేగతి నాదరింతువో।
కట్టషి దైవమా! విషము ♦ కాలము నాకిది రంగనాయకా॥

76. ఓంపినచిక్కుఁబట్టిహరి ♦ యూంత యటంచునుబద్దుపట్టి యే।
యాపదచుట్టుముట్టినను ♦ నేర్పడదుఃఖముగట్టిపెట్టి న్నా।
పాపపుబుద్ధినిల్వఁబని ♦ పల్మఱుఁగొట్టి వచింతుగట్టిగా।
నాపయితప్పుఁబెట్టుటేఁక ♦ న్యాయ్యమె తెల్పవె రంగనాయకా॥

77. క్రౌర్యముబూని శ్రీహరిని ♦ గట్టిమంచును గ్రూరచిత్తులై।
ధైర్యరమావిశేషముల ♦ ధార్మికులన్ జెఱపెట్టికాంతలు।
శౌర్యమువీఱఁబట్టిఖల ♦ చర్యలుచేసియునంత్యమందు నీ।
వీర్యతఁజచ్చినీవలన ♦ వెల్గడెనీరెకడ రంగనాయకా॥

78. దీనులకల్పవృక్షమయి ♦ దివ్యసమాజపుఁబెద్దయౌచుఁ జె।
న్గానలనుండు మానులకు ♦ గాపరి వైభవ దంఘ్రిపద్మముల్।
మానసమందు నిత్యమును ♦ మానక సేవలుచేయు వారికిన్।
మానకసేవకుండవయి ♦ మన్ననఁబ్రోతువు రంగనాయకా॥

79. క్రూరతఁబూని దుష్టమతి ♦ కూడనికర్మల సజ్జనాళికిన్।
ఘోరభయంబులన్ బ్రబల ♦ కోపములన్ విహరించురాక్షసుల్।
వైరులువారిఁజంపి ఘన ♦ వైభవసత్పథజాల మియ్యవే।
యారయనీదయామహిమ ♦ యన్యులకుండునె రంగనాయకా॥

80. కన్నులకాంతుఁడీజనిను ♦ గన్గొనుభాగ్యము నాకుఁగల్గునే।
పన్నగశాయి! నేపడెదు ♦ పాట్లనెఱుంగవె దూరదృష్టిచే।
నెన్నఁడువిందునో చెపుమ ♦ యేమిభయంబనిదెల్పువాక్యముల్।
నిన్నెదలంతు నన్యులను ♦ నేరినుతింపను రంగనాయకా॥

81. వింతగదాభవన్మహిమ ♦ వేమఱుభక్తిభజించువారికిన్।
సుంతయుద్రవ్యమబ్బదు ♦ సుఖంబొనఁగూడదు కష్టజాలముల్।
పంతముతోడఁజుట్టుకొను ♦ ప్రస్తుతిసేయనివారికన్నియున్।
సంతసమొప్పఁజేకురును ♦ స్వామి! దయామయ! రంగనాయకా॥

82. పంకజనాభ! వేదనుత! ♦ పావననామ! రమాధినాయకా!।
సంకటహారి! శౌరి! ముని ♦ సన్నుత! మాధవ! భక్తవత్సలా।
పంకజనేత్ర! నీలనిభ! ♦ భాసురగాత్ర! మహాపవిత్ర! యే।
వంకలుగల్గినన్ విడువ ♦ వద్దనిమ్రొక్కెద రంగనాయకా॥

83. దండముసీరజాప్తకుల! ♦ ధన్యచరిత్రమురారినీకిదే।
దండముపాపనాశ! హరి! ♦ దానవభంజన! భక్తరంజనా!।
దండముదేవసన్నుత! యెదన్ ♦ దలపోసెద మానసంబునన్।
దండమురావణాంతక! ము ♦ దంబునఁబ్రోవవె రంగనాయకా॥

84. కుండలిశాయి! నీభజన ♦ కూడదటంచును జాఁటుదుర్జనుల్।
మొండిశిఖండిఖండలయి ♦ ముక్తికిమార్గమెఱుంగలేక పా।
షండులు పాపులైయముని ♦ పాలనుందురు వారిజన్మముల్।
దండుఁగుగాదె భూస్థలిని ♦ దైత్యకులాంతక రంగనాయకా॥

85. వారలవీరలఁ జెఱిచి ♦ వంచనఁజేసి ధనంబులందగా।
గోరిమహాపరాధములు ♦ గొబ్బునఁజేయుచుఁగాని వేళలఁ।
శ్రీరమణా! యటంచునిను ♦ జింతనచేయఁగ మేలుచేయగా।
వారలనీతివర్తనము ♦ వమ్మగుసత్యము రంగనాయకా॥

86. వారకపుత్రమిత్రజన ♦ వర్యులకుఁ వశుఁడై నరుండు వే।
సారకపాపపుణ్యముల ♦ భావమునందల పోయలేక సం।
సారమెసారమంచుమది ♦ చంచలమందఁగ నష్టకష్టముల్।
ఘోరభయంబులందుచును ♦ గుల్లునునెన్నది రంగనాయకా॥

87. మానసమందుఁ జింతలను ♦ మ్రందుటనిత్యము రామచంద్ర! నీ।
ధ్యానముఁజేయు కాలమున ♦ దిక్కులుదోఁచక దుఃఖమందుచుఁ।
దీనునిభంగినాయెదను ♦ దేవ! గనుంగొన నిన్నుగోరుటల్।
పూనికనీవెఱుంగవె వి ♦ మోహినిబ్రోవవె రంగనాయకా॥

88. పూజలొనర్తునామతిని ♦ పుష్పసుగంధ జలాభిషేకముల్।
రాజితభక్తిహారతులు ♦ రమ్యసుహారముఁలంజలుల్ మహా।
రాజితపాత్రవర్గముల ♦ రామ! యొసంగెదనేనివేదనల్।
శ్రీజయభాగ్యసంపదలు ♦ శీఘ్రమొసంగవె రంగనాయకా॥

89. శ్రీధర! వాసుదేవ! యదు ♦ శేఖర! కేశవ! నందనందనా!।
మాధవ! పద్మనాభ! ముర ♦ మర్దన! శ్రీనరసింహా! దేవ! యా।
రాధితచిత్తసంచరణ ♦ రావణసంహార! చక్రపాణి! వీ।
రాధికకవీరశౌరి! నను ♦ రాయిడిబెట్టకు రంగనాయకా॥

90. అన్నిటికంటె సౌఖ్యమగు ♦ నన్నిటిమించు సుఖంబులిచ్చులే।
దెన్నటికిఁ భయంబు ధన ♦ మేమియునక్కఱలేదు ధాత్రిలో।
నిన్నుఁదలంచుచున్ననరు ♦ నిక్కముగాంచియు మ్రొక్కువారికే।
యున్నదిసర్వకార్య జయ♦మున్నది మోక్షము రంగనాయకా॥
91. గుమ్మనివాసనల్ రుచులుఁ♦గొల్లఁగఁగావలె సర్వసౌఖ్యముల్।
కొమ్మలు పుత్రమిత్రులును ♦ గోరినయట్లుల భాగ్యసంపదల్।
సమ్మతి శాంతముఁ శమము ♦ సత్యముగౌరవ జీవనంబుఁగా।
కిమ్మహిమానవుల్ మరువ ♦ కెప్పుడుఁగోరుట రంగనాయకా॥
92. కోరుదురంతి యేజనులు ♦ గోర్కులుదీరునె యెట్టివారలుఁ।
ధీరతనీపదాబ్జములు ♦ దిక్కనినమ్మిన యట్టివారికే।
కోరినకోర్కెదీఱు నోరు ♦ కోర్కెలు దూరములౌను శ్రీపతీ।
ధారణి సర్వదాతలకు ♦ దాతవునీవిఁక రంగనాయకా॥
93. అన్యులవేఁడనీదునుతు ♦ లన్ననుపీడ హృదంతరంబునఁ।
ధన్యతఁబొందుజాడఁదల ♦ దాల్చికృశించెడిపేద నాయెడఁ।
మాన్యతతోడఁ గోర్కెలిడ♦మాధవ! దాసుఁడ నీచరిత్రమా।
నన్యముకాని మార్గమును ♦ నారయఁజూపవె రంగనాయకా॥
94. పన్నగశాయి! శ్రీరమణ! ♦ పాపవిమోచన! దీనపాలనా।
పన్నగవైరివాహ! హరి! ♦ భావజసుందర! భక్తరక్షణా।
పన్నగభూషవంద్య! పరి ♦ పాలితసజ్జన! యోమురారి! యా।
పన్నశరణ్య! నీవెగతి ♦ ప్రస్తుతిఁజేసితి రంగనాయకా॥

95. పాపలచూపులోపలను ♦ బల్మఁజూడగ నీదుగు దివ్యరూపముఁ జూపియుఁమాపుఁజేయుదువు ♦ చూడగ, జూడగ నేమికర్మమో।
శ్రీపతి! యెంతకాలమిటు ♦ చిక్కులఁబెట్టెదో నీదురూపముఁ జూపకయున్ననీగతిని ♦ స్రుక్కక స్రొక్కెన రంగనాయకా॥

96. చన్నులఁబాలు ద్రావిరుచి ♦ చందమెఱుంగని చిన్నబిడ్డలన్।
అన్నముఁ నీకుఁ బాయసము ♦ లన్నిరుచుల్ తినసేర్పియావలన్।
జన్నులఁబాలు ద్రావుమన ♦ సాగునెయాగతి నీదురూపమున్।
గన్నులగాంచి మానుమనఁ ♦ గష్టమునాకిఁక రంగనాయకా॥

97. పాపలమధ్య సూక్ష్మముఁగ ♦ భావముఁబట్టియు నిక్కిచూడగా।
లోపలనుండి వెల్గునను ♦ లుప్తతనీదు స్వరూపముంచి నే।
లోపలసంతసించెదను ♦ లోపముసేయకు సర్వకాలముఁ న్।
నీపయినిల్చు మానసము ♦ నిక్కముఁనాకిడు రంగనాయకా॥

98. భద్రముగాదె దీనజన ♦ పాలన! నీదుకృపారసంబు నే।
ఛిద్రముఁలందకుండఁగను ♦ జేయుదె నీమహనీయమాయలన్।
రుద్రవిరించి దేవతలు ♦ రోఁతలఁబట్టరె తెల్వి లేమి నే।
క్షుద్రుడఁడనిన్నుగన్గొనఁగ ♦ శోభనమూర్తివి రంగనాయకా॥

99. ఏగతిజూతువో మనసు ♦ నెట్టులనిల్పెదో పాపజాల మిం।
కేగతిరూపుమాపెదవో ♦ యేవిధినన్ దయచూచిబ్రోచెదో।
యేగతిజీవయాత్రఁ దరి ♦ యింపఁగఁజేయుదో యెల్లకాలమే।
యేగతిజేయుసమ్మతమొ ♦ యీశ! పరాత్పర! రంగనాయకా॥

100. అన్యముమాని కర్మముల ♦ నన్నిటివీడినిరంతరంబు నే।
ధన్యతఁగాంచునీదునుతి ♦ తప్పనటంచును బాసలెన్నియో।
మాన్యతఁజేయువాఁడఁ ♦ దృఢమూనుదు దుష్పథగామినౌదునా।
జన్యముఁబోదిఁ కేదిగతి ♦ చేకుర్పఁజేయుదొ రంగనాయకా॥

101. తృప్తివహింపదెన్నఁడును ♦ దోఁపఁగనియ్యదు మంచిమార్గమే।
యాప్తులు సద్వివేకమిది ♦ యన్ననునమ్మఁగనీదు నాత్మకున్।
సప్తసముద్ర ముద్రితము ♦ సర్వధరాతల మబ్బినన్ నరున్।
దృప్తివహింప 'దాశయ'ను ♦ తోరపుఁబాశము రంగనాయకా॥

102. దోసిలియొగ్గివేఁడెదను ♦ దోయరుహాసన! దోషనాశనా!।
వాసిగనీదయామృతము ♦ వాసవవందిత! దాసకోటికిన్।
భాసురలీలనేపొసఁగి ♦ పాలనఁజేసితొ నాకొసంగునీ।
దాసులకెల్లదాసుఁడను ♦ దాస్యముఁజేసెద రంగనాయకా॥

103. అన్నిటనిండియుండియును ♦ నంటకయొందును గానరాక నీ।
వన్నిటయెక్కుడవై తెలియ ♦ నన్యులకెవ్విధినైనఁ జిక్కకే।
పన్నగనీదు మాయలను ♦ భ్రాంతులఁజేయుదు జీవకోటులన్।
నిన్నుఁగనంగనాతరమె ♦ నీరజలోచన! రంగనాయకా॥

104. ఎల్లవిధంబులన్ మరువ ♦ కెప్పుడునిన్నుహృదంతరంబునన్।
సల్లలితప్రభావనిధి ♦ సన్నుతిఁజేయఁగ నిశ్చలంబునా।
యుల్లమునందు భద్రముగ ♦ నుండెడురీతి లిఖింపవేఁడెదన్।
కల్లయొనర్పకీవు దయ ♦ గావఁగ మ్రొక్కెద రంగనాయకా॥

105. శ్రీలలనామనోహర! ర ♦ చించితి నీశతకంబదెట్టులో।
బాలుఁడఁదప్పు నొప్పుఁదగఁ♦బాలనజేయవె నీకుమ్రొక్కెదన్।
జాలఁగనీపదాబ్జములు ♦ సన్నుతిఁజేయుచుఁ దోచినట్టులే।
పాలితభక్తిజాల! కొను ♦ భాగ్యవిధాయక రంగనాయకా॥

106. శ్రీశ! చిదంబరాఖ్యుఁడను ♦ సేవకుఁడన్ భవదంఘ్రిభక్తుఁడన్।
కౌశికగోత్రసంభవుఁడఁ ♦ కౌస్తుభవక్ష! రమామనోహరా!।
యాశగనీదయామృతము ♦ నబ్దముఁరీతిని సాధుధారగా।
దాసుఁడనాపయిన్ గురిసి ♦ ధన్యునిఁజేయవె రంగనాయకా॥

107. ఉత్పలపద్యపుష్పముల ♦ నుంచితి హారముఁగూర్చి నీమెడన్।
సత్పురుషుల్ సుహారములఁ ♦ జాలఁగనియ్యరె యెత్తుకెత్తుగా।
సత్పథగామిగాకనుతి ♦ సన్నుతికెక్కనెయంచు నెంచకీ।
యుత్పలమాలికాళిఁగొను ♦ మోపికతోనిఁక రంగనాయకా॥

108. శ్రీనరసింహ! శ్రీరమణ! ♦ సేవకపోషణ! సాధురక్షణా।
దీనజనావనా! సమర ♦ ధీర! జగన్నుత! యోజనార్దనా।
దానవవైరి! హారతులు ♦ దండిగనిచ్చెద నిష్టదైవమా।
ధ్యానమొనర్తు రక్షకుఁడ ♦ ధన్యునిజేయవె రంగనాయకా॥

శ్రీ ఆలూరుకోన రంగనాయక శతకము

సంపూర్ణము.

